

# నా ప్రాణ స్నేహితుడివి నువ్వు



## పెద్ద బబుల్‌ని ఎలా ఊదాలో తెలుసా మీకు ?













బలే పెద్ద బబుల్...
బలే సులభం.

Trikaya-CP 12 84 Tel.




# దీనిలో మేమందరం ఒకటే
# ఎంత బాగుంటుందో
# ఎంత రుచిగా ఉంటుందో

కంపా ఆరెంజ్ ఫ్లేవర్—
ఆహ్లాదాన్ని కలిగించే రుచి

Campa

కృత్రిమ వాసన చేర్చబడింది.
[illegible]



అప్పుడు గురువు వాణ్ణి దగ్గర కూర్చో బెట్టుకుని, "ఒరే, గేదెలు మనిషికన్న, పాలు ఇస్తున్నది. అందుకు కారణం గేదె శరీర నిర్మాణంలోని ప్రత్యేకత. అదే విధంగా, మనిషి అనుభవాలను జ్ఞానంగా మార్చుకుంటుంది వయస్సు. ఆ విశేషాలన్ని వివరంగా చెబుతాను, వింటావా?" అని అడిగాడు.

"వినడమంటే నాకు మహా చిరాకు!" అన్నాడు సుబ్బడు.

నాలుగు రోజులు గడిచాక గురువు వాణ్ణి దగ్గరకు పిలిచి, "ఒరే, నువ్వు గాలిలో ఎగరవచ్చు. నీటి మీద నడవ వచ్చు. అలాంటి మంత్రాలు చెబుతాను. అందుకు ముందుగా నువ్వు అక్షరాలు నేర్చుకోవాలి!" అన్నాడు.

సుబ్బడు సరేనన్నాడు. గురువు వాడికి అక్షరాలు నేర్పటం మొదలుపెట్టాడు. నేర్చుకుంటున్నంతసేపూ వాడిదృష్టి ఇంకె పనుల మీద వుండేది. ఎంతసేపు దిద్దినా వాడికి ఒక్క అక్షరం కూడా రాలేదు.

అప్పుడు గురువు, వాడి దగ్గరకు ఒక ఐదేళ్ళ కుర్రవాడిని తీసుకువచ్చి, "చూడు, వీడికి ఐదేళ్ళు; నీకు పదేళ్ళు. వీడికిప్పుడు అక్షరాలు నేర్పుతాను. ఎంత సేపట్లో వస్తాయో చూడు!" అన్నాడు.

ఆ కుర్రవాడికి చాలా తక్కువ సమయంలో బోలెడు అక్షరాలు వచ్చేశాయి. సుబ్బడు వాణ్ణి శ్రద్ధగా గమనించి, "అక్షరాలు నేర్చుకునేందుకు, ఐదేళ్ళవయసే వుండాలి. నేను పెద్దవాడినైపోయాను. అందుకే నాకు రావటం లేదు." అన్నాడు.

గురువు శాంతంగా, "అక్షరాలు నేర్చుకునేందుకు వయసుతో నిమిత్తం లేదు. నువ్వు ఎవరినైనా పెద్దవాణ్ణి తీసుకురా. నేను నేర్పుతాను," అన్నాడు.

సుబ్బడు ఇంటికి వెళ్ళి తాతయ్యను తీసుకువచ్చాడు. కాసేపు దిద్దగానే వాడికి అక్షరాలు వచ్చేశాయి.

"చూశావా? చదువుకునేందుకు శ్రద్ధ వుండాలి తప్పితే, వయసుతో ఏ మాత్రం



నిమిత్తం లేదు,'' అని చెప్పాడు గురువు నెమ్మదిగా.

''పాలేరుకు ఇరవైఏళ్ళు. అందువల్ల, వాడికి చదువు వస్తుంది. నాకూ ఇరవై ఏళ్ళు వచ్చాక, నేనూ చదువుకుంటాను.'' అన్నాడు సుబ్బడు.

''సరి, పదేళ్ళవాళ్ళెవరైనా వుంటే తీసుకురా. వాళ్ళకు నేను చదువు చెబుతాను,'' అన్నాడు గురువు ఓర్పుగా.

సుబ్బడు ఊరంతా తిరిగాడు. ఊళ్ళో పదేళ్ళ వయసులోని కుర్రవాళ్ళంతా చదువుకుంటున్నారు. చదువురాని పదేళ్ళ కుర్రవాళ్ళెవ్వరూ, ఆ ఊళ్ళో లేరు.

''అంతమంది మధ్య, నీ ఒక్కడికే చదువు రాదంటే అవమానంగా వుంటుంది. అందుకని శ్రద్ధపెట్టి చదువుకో.'' అన్నాడు గురువు.

''నేను దేనికీ అవమానపడను. ఎవరి అదృష్టం వాళ్ళది. మీరు చాలా పొట్టిగా వుంటారని, అందరూ నవ్వుకుంటారు. అందుకు అవమానపడి, మీరేం చెయ్యగలరు? మీరు పొడుగు ఎదగలేరు; నేను చదువుకోలేను. అంతే!'' అన్నాడు సుబ్బడు.

''నువ్వు చదువుకోకపోయావంటే, రోజూ పది కొరడా దెబ్బలు తినవలసి వుంటుంది!'' అన్నాడు గురువు కఠినంగా.

సుబ్బడు భయపడ్డాడు. రోజూ చాలా సేపు చదువుకోసాగాడు. అయినా, వాడికి ఒక్క అక్షరం కూడా రాలేదు.

ఒక రోజున గురువు, వాడితో, ''రోజూ నువ్వు పది అక్షరాలైనా నేర్చుకోవాలి. పదికి ఎన్ని అక్షరాలు తక్కువైతే, అన్ని కొరడా దెబ్బలు తినాలి!'' అన్నాడు కోపంగా.

''ఇది చాలా అన్యాయం!'' అన్నాడు సుబ్బడు.

''ఎందువల్ల?'' అని అడిగాడు గురువు మరింత కోపంగా.

''చదువు నేర్చుకోవడం, నా బాధ్యత. ఆ బాధ్యతలో, లోపం జరిగితే తప్పు




## 6

[విద్యుత్తుడు మరికొంత కొత్త సైన్యంతో నగరం ప్రవేశించడం వల్ల, చంద్రవర్మ వ్యూహం విఫలమయింది. అతడూ, సమరసేనుడూ గుర్రాల మీద నగరం వదిలి కొండలకేసి పారిపోయారు. కొండలలో శత్రువులు వారిద్దరినీ చుట్టుముట్టారు. చేసేది లేక చంద్రవర్మ, సమరసేనుడూ కొండ దిగువను ప్రవహిస్తున్న ఒక పెద్ద నదిలోకి దుమికారు. తరవాత—]

చంద్రవర్మ నది ప్రవాహంలో ఈదేందుకు ప్రయత్నించాడు. కాని, ఉధృతమైన ప్రవాహ వేగం అతణ్ణి అటూ యిటూ విసిరికొట్ట సాగింది. కొండ అంచున వున్న శత్రుసైనికులు గేలిగా మాట్లాడుకోవటం అతడికి లీలగా వినిపిస్తూనే వుంది. సమరసేనుడు కూడా తనతోపాటు నదిలోకి దూకాడా? లేక శత్రువులచేత పట్టుబడి పోయాడా?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూ, నదీజలంలో వేగంగా కొట్టుకుపోసాగాడు. ఈదటానికి అతడు చేసిన ప్రయత్నం ఫలించలేదు. కొద్దిసేపటిలోనే అతడు ఆయాసంతో సొమ్మసిల్లి పోయాడు. ఇక తనకు చావు తప్పదు, అనుకుంటూ అతడు కడసారిగా మునిగి పోకుండా వుండేందుకు గట్టిప్రయత్నం చేసి నిస్పృహతో కళ్ళు మూసుకున్నాడు.



చంద్రవర్మ తిరిగి కళ్ళు తెరిచేసరికి సూర్యుడు ఆకాశమధ్యంలో వున్నాడు. చుట్టూ చిక్కదట్టంగా పెరిగిన చెట్లతో అతి భయంకరంగా వున్న అడవి. తను అప్పుడు ఒక చిన్న నీటి మడుగు ఒడ్డున పడివున్నట్టు అతడు గ్రహించాడు. తను అదృష్టవశాత్తూ నది అలలలో మునిగి పోకుండా, దాని పాయలలో ఒకదాని వెంట కొట్టుకువచ్చి యిక్కడికి చేరినట్టు అతడు తెలుసుకున్నాడు. ఆ వెంటనే అతడికి సుబాహుడు గుర్తుకు వచ్చాడు. చంద్రవర్మ మెల్లిగా లేచి చుట్టూ అతని కోసం నాలుగువైపులా కలయచూశాడు. అతని జాడ లేదు.

కొద్దిసేపటికల్లా చంద్రవర్మను ఆకలి దహించసాగింది. అతడు నీటిమడుగు దగ్గిర నుంచి కదిలి, అల్లంత దూరంలో వున్న చెట్లను సమీపించాడు. ఆ చెట్లలో కొన్ని ఫలభారంతో భూమికి వంగి వున్నవి. ఆకలిగొని వున్న చంద్రవర్మ చేతికి అందిన పండ్లను కోసుకుని తృప్తిగా తిన్నాడు.

ఆకలి దప్పులు తీర్చుకున్న తరవాత చంద్రవర్మ తన పరిస్థితిని గురించి ఆలోచించసాగాడు. తను శత్రువులచేత బందీకాకుండా తప్పించుకోగలిగాడు. అది గొప్ప అదృష్టమే. కాని, యిప్పుడు తను వున్న అటవీప్రాంతం ఎలాంటిది? అందులో మానవమాత్రులు లెవరైనా వున్నారా? లేక క్రూర మృగాలకూ, భూత ప్రేతాలకూ ఉనికి పట్టయిన చోటా? ఈ విధంగా ఆలోచిస్తూ చంద్రవర్మ అడవిలోకి బయలుదేరాడు. అతడు చెట్ల కిందుగా కొద్ది దూరం నడిచేంతలో, తీవ్రమైన పెను గాలి తాకిడికి అల్లకల్లోలమైనట్టుగా అడవిలోని చెట్లన్నీ ఒక్కసారి భూమి మీదికి వంగి, అంతలోనే దేహాన్ని గగుర్పొడిచేలా వికృతంగా ఊళలూ, అరుపులూ ప్రారంభించినై.

ఈ వింత చూస్తూనే చంద్రవర్మ స్థాణువులా అయిపోయాడు. చెట్లకొమ్మలు చేతులు చాచినట్టుగా అతడికేసి వంగి



"నాయనా, కాలనాగూ! ఆ మానవుణ్ణి చంపకు. కష్టాలలో చిక్కి, తెలీక మన దగ్గిరకు వచ్చినవాడు. అతడు మనకు అతిథి సమానుడు. క్షేమంగా నా దగ్గిరకు తీసుకురా!"

ఆ మాటలు వింటూనే మూడు తలల కాలసర్పం, చంద్రవర్మకు అంత ఎడంలో ఆగిపోయింది. అడవిలోని చెట్లన్నీ నిశ్శబ్దంగా ఊగుతున్నవి. గాలి స్తంభించిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యంగా సర్పం కేసి చూశాడు.

కాలసర్పం తనను అనుసరించమన్న సూచనగా మూడు తలలనూ ఒకసారి చంద్రవర్మ కేసి ఆడించి, అడవిలోకి బయలుదేరింది. చంద్రవర్మకు మార్గాంతరం కనిపించలేదు. ఈ అడవి ప్రాంతాన్నంతా తమ మంత్రబలంతో ఎవరో వశపరుచుకుని వున్నారు. ఆ గొంతు ఆ వ్యక్తిదే! తను ఆ మూడు తలల సర్పాన్ని అనుసరించి వెళ్ళక తప్పదు. పారిపోవటానికి ప్రయత్నిస్తే తనకు యీ నిముషానే చావు మూడుతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచిస్తూ, కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుని కాలసర్పాన్ని అనుసరించి నడవసాగాడు. కొంత దూరం వెళ్ళేసరికి ఎదురుగా పెద్ద మనిష్య గడ్డతలా, రెక్కలూ—సింహ శరీరంతో వున్న ఒక పెద్ద విగ్రహాకారం కనిపించింది. సర్పం దాని ముందుకు వెళ్ళి ఆగి, మూడు తలలనూ ఒకసారి వంచి పెద్దగా బుసకొట్టింది. మరుక్షణం ఆ విగ్రహాకారం నిలువునా రెండుగా చీలి పక్కలకు పడిపోయింది. వెంటనే శిథిలావస్థలో వున్న ఒక గృహం, దాని వాకిట తెల్లని బట్టలతో, ముడతలు పడిన శరీరంతో, వయసు వంగి వున్న ఒక స్త్రీ చంద్రవర్మకు కనిపించింది.

చంద్రవర్మకు నోట మాట రాలేదు. ఆ స్త్రీని చూస్తూనే, యీమె పిశాచా, మానవ స్త్రీయా అనుకున్నాడు. అంతలో ఆ స్త్రీ చేతిలో వున్న కర్రను భూమి మీద రెండు



ఒరలో పెడుతూ, "కాపాలినీ, నేను రాజ్యాన్నీ, స్నేహితులను కూడా కోల్పోయి ఈ అడవి ప్రాంతాలు చేరిన నిర్భాగ్యుణ్ణి. నేను నీకు ఎలాంటి హాని తలపెట్టబోవటం లేదు. నువ్వు కూడా నాకు ఎలాంటి హాని చేయవని నమ్మవచ్చునా?" అన్నాడు.

"నేను నీకు హాని తలపెట్టటమా?" అంటూ కాపాలిని ఆశ్చర్యంగా చంద్రవర్మకేసి చూసి, "చంద్రవర్మా! నేను నా చేతనైన విధంగా నీకు సహాయం చేయదలిచాను. కాని, ఆ సహాయం చేసేముందు, నువ్వు నాకొక సహాయం చేయవలసి వుంటుంది." అన్నది.

తనను పేరుతో కాపాలిని సంబోధించటంతోనే, చంద్రవర్మకు ఆ మాంత్రికురాలి శక్తి సామర్థ్యాల మీద నమ్మకం కుదిరింది. బహుశా, ఆమెకు తనను గురించి సర్వం తెలిసివుంటుంది. అప్పుడు వీరపురంలో ఏమి జరుగుతున్నదీ, తన పెదనాన్న ధీరమల్లుడూ, మహాపాలుడూ ఏమయ్యారో కూడా ఆమె చెప్పగలగవచ్చు!

చంద్రవర్మ నిర్భయంగా కాపాలినిని సమీపించాడు. ఆమె అతన్ని ఎంతో గౌరవంగా ఇంటి లోపలికి తీసుకుపోయింది. ఇంటి గోడలకు అనేక జంతువుల తలలూ, మానవ కపాలాలూ వేలాడుతున్నవి. గోడలో పెద్ద గవాక్షం వున్నచోట వింతగా తయారు చేసిన ఒక బల్ల మీద పెద్ద గాజు గోళం ఒకటి తళతళ మెరుస్తున్నది.

కాపాలిని, చంద్రవర్మకు గాజుగోళం వున్న బల్లకెదురుగా ఒక మెత్తను చూపిస్తూ, "వర్మా, అక్కడ కూర్చో. నువ్వు నిజంగా నదిలో మునిగిపోకుండా బతికి బయట పడటం నా అదృష్టమే అనుకుంటున్నాను. నేను సాధించవలసిన ఒక కార్యం అయితే నీవల్లనే కావాలి, లేకపోతే మరెవ్వరివల్లా కాదు." అన్నది.

చంద్రవర్మ గాజుగోళం ఎదురుగా మెత్త మీద కూర్చుంటూ, "కాపాలినీ, యా



గోళం చూడటానికి చాలా వింతగా ఉన్నది. ఇలాంటి వాటి ఉపయోగాన్ని గురించి నేను ఇదివరకే కొంత విని ఉన్నాను. అందులో మనం మనుష్యుల భూత భవిష్య ద్వర్తమానాలను చూడ వచ్చునా?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాపాలిని నిస్పృహగా నిట్టూర్చి, "నాయనా, చంద్ర వర్మా! నువ్వనుకుంటున్నట్టు, యీ గాజు గోళం నిజంగా భవిష్యత్తులో జరగబోయే దాన్ని కూడా చూపించగలిగితే, నేను యింత నిరాశ పడవలసిన అవసరం లేదు. ఈ గోళం భూత వర్తమానాలను మాత్రమే చూపగలుగుతుంది. ఆ కారణం వల్లనే నేను ఒకానొక కష్టసాధ్యమయిన కార్యం సాధించేందుకు నీ సహాయం కోరు తున్నది," అన్నది.

"ఆ కార్యం అంత కష్టసాధ్యమా?" అన్నాడు చంద్రవర్మ.

"అవును, కష్టసాధ్యమే; అసాధ్యం మాత్రం కాదు. ఇక్కడికి మూడు రోజుల దూరంలో కంబుకుడు అనబడే ఒకా నొక మాంత్రికుడున్నాడు. నువ్వు అతని మంత్రగృహంలో జొరబడి, దానిలో ఒకా నొక వస్తువును సంగ్రహించి తేవలసి ఉంటుంది. ఆ వస్తువుగాని లభ్యమయితే, నేను మరొక వెయ్యేళ్ళు కాలం యౌవనా రోగ్యాలతో సుఖంగా జీవిస్తాను. లేక పోతే..."

కాపాలిని మాట ముగించకుండానే, వెక్కి వెక్కి ఏడుస్తూ, కన్నీళ్ళను తుడుచుకోసాగింది. చంద్రవర్మకు ఆ నిముషంలో ఆమె మీద ఎక్కడలేని జాలి కలిగింది. ఆ మంత్రగత్తె, తనను మోసం చేసే హితమార్గాలని చూస్తున్నదేమో అన్న సంశయం అంతవరకూ అతని మన సులో ఏమైనా ఉంటే, అది కాస్తా ఆమె దుఃఖాన్ని చూస్తూనే మాయమయింది.

"కాపాలినీ, నేను నీకు నా కాయ శక్తులా సహాయం చేస్తాను. కాని, ముందుగా నీవు నాకు ఒక చిన్న ఉప

వరదలూ, తుఫానులూ లాంటి ప్రకృతి వైపరీత్యాలను ఆపలేము. నిజమే! అయినా, వాటివల్ల ప్రజలు విపరీతమైన బాధలకు గురి కాకుండా, ముందుగానే తగు రక్షణచర్యలు ప్రారంభించవచ్చు, అది నాకు సాధ్యపడటం లేదు. తమరే ఏదైనా మంచి మార్గం మాకు చూపించాలి," అని కోరాడు.

జ్ఞానాశ్రయుడు చిరునవ్వు నవ్వి, "నీ కోరిక బాగానే వున్నది. పని ఏదైనా, దాన్ని సక్రమంగా నిర్వహించాలంటే, ముందు చక్కగా ఆలోచించాలి. అప్పుడే అది జయప్రదం అవుతుంది. నీ దగ్గిర దక్షత గల ఉద్యోగులు వున్న మాట నిజమేనా?" అని అడిగాడు.

అందుకు శంతనవర్మ, "నా ఉద్యోగుల దక్షతలోనూ, శక్తిసామర్థ్యాలలోనూ నాకు నమ్మకం వున్నది. వాళ్ళు రాజ్యపాలనకు సంబంధించిన అన్ని విషయాల్లోనూ, తగిన సలహాలు ఇస్తూ సహాకరిస్తున్నారు. ప్రజాహిత కార్యాలు మరింత వేగంగా జరగాలన్నదే, నా తాపత్రయం," అన్నాడు.

ముని కొద్దిసేపు మౌనంగా వూరుకుని, తరవాత, "రాజా, అలా అయితే, నీకు అపూర్వశక్తులు గల ఒక చిన్న యంత్రాన్ని బహుమానంగా ఇస్తాను. దాన్ని శిరస్సు మీద వుంచుకుని, మున్ముందు ఏది జరగాలనుకుంటున్నావో, అది మనస్సులో అనుకుంటే చాలు. అప్పుడు యంత్రంలోంచి



తపశ్శక్తి కొంత ధారపోసి నిర్మించిన సలహాలిచ్చే యంత్రాన్ని అపహరించలేదు. అయినా, అతడు తృప్తిపడక దాన్ని మునికి తిరిగి యిచ్చివేశాడు. పైగా, తపశ్శక్తులతో ఎదురయ్యే సమస్యలంటూ, తన అమాయకత్వాన్ని బయటపెట్టుకున్నాడు. ఈ విధంగా అతడు ప్రజలకు మహోపకారం చెయ్యగల అవకాశాన్ని జారవిడిచాడు. అందుకు కారణం అతడి మూర్ఖతా, అమాయకత్వాలే కదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శంతనవర్మ, ముని జ్ఞానాశ్రయుడిచ్చిన యంత్రాన్ని తిరిగి యిచ్చివేయడంలో, గొప్ప లౌకిక జ్ఞానాన్ని, వివేకాన్ని ప్రదర్శించాడు. ఏవో చిన్న లోపాలున్నా, అతడు స్వయంగా ఆలోచించి, తన ఉద్యోగులిచ్చే సలహాలను పాటించి రాజ్యాన్ని చక్కగా పాలిస్తున్నాడు. అటువంటప్పుడు, ముని యిచ్చిన యంత్రాన్ని గనక అతడు ఉపయోగించడం ప్రారంభిస్తే, ఇక వాళ్ళల్లో ఎవరికీ ఆలోచించవలసిన అవసరం కలగదు. అందువల్ల, వాళ్ళ మెదళ్లు మొద్దుబారి ఆలోచనాశక్తి సన్నగిల్లే అవకాశం వున్నది. పదిహేను సంవత్సరాల తర్వాత యంత్రం తన శక్తిని కోల్పోవటంతో, వాళ్ళు సక్రమంగా ఆలోచించడాన్ని మొదటి నుంచి మళ్ళీ నేర్చుకోవలసివస్తుంది. ఆలోచనాశక్తి వున్నందువల్లనే, మనిషి తక్కిన జీవజాలంకన్న ఎన్నోరెట్లు అధికుడనిపించుకుంటున్నాడు. ఆ శక్తిని బద్ధకంగా వదులుకుని మంత్రాలతోటి, యంత్రాలతోటి పొందే ప్రయోజనం చాలా తాత్కాలికమైనది. ఇంత ఆలోచించగలిగిన శంతనవర్మ మూర్ఖుడూ కాదు, అమాయకుడూ కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఋషిశాపం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతని తండ్రి మణిమాణిక్యాల్లాంటి విలువైన వస్తువులతో వ్యాపారం చేస్తూండేవాడు. ఆయన బోధిసత్వుణ్ణి పదహారేళ్ళ వయసువరకూ, ఒక గురుకులంలో వుంచి చక్కగా విద్య నేర్పించాడు.

బోధిసత్వుడు గురుకులం నుంచి ఇంటికి తిరిగి రాగానే, అతని తండ్రి, "నాయనా, నేను పెద్దవాణ్ణి అయిపోతున్నాను. నువ్వు నాకు ఒక్కగానొక్క సంతానం. నీకు, ఇంతకాలంగా నేను చేస్తున్న వ్యాపారంలోని మెలకువలు నేర్పవలసివుంది," అన్నాడు.

బోధిసత్వుడు అందుకు సరేనన్నాడు. ఆ తరవాత ఒక వారం రోజులకు తండ్రీ కొడుకులు విలువైన మణిమాణిక్యాలను మూటలు కట్టుకుని, వ్యాపారనిమిత్తం బయలుదేరారు.

ఆ విధంగా యిద్దరూ అనేక గ్రామాలూ, పట్టణాలూ తిరిగి లాభసాటిగా తమవద్ద వున్న మణిమాణిక్యాలను అమ్ముతూ, చివరకు వారాణసి నగరం చేరారు. అయితే, వాళ్ళు ఆ నగరం చేరేసరికి సూర్యాస్తమయమై క్రమంగా చీకటి అలుముకుంటున్నది.

బోధిసత్వుడి తండ్రి నగరద్వారపాలకుల్ని సమీపించి, నగరంలో ప్రవేశించేందుకు అనుమతి కోరాడు.

"అయ్యలారా, మీరు చూడగా ధనిక వర్తకుల్లా వున్నారు. కాని, రాజాజ్ఞ ధిక్కరించరానిది. సూర్యాస్తమయం నుంచి, తిరిగి సూర్యోదయం వరకూ నగర ద్వారాలు తెరవరాదని, ఆయన ఆజ్ఞ!" అన్నారు ద్వారపాలకులు.



అప్పటికేమి చేయడమూ అన్న సమస్య, ఆ తండ్రీకొడుకులకు ఎదురయ్యింది. బోధిసత్వుడి తండ్రి అతనితో, "నాయనా, మన రాత్రిభోజనం మాటేమిటి? నగరం ప్రవేశిస్తే, ఏ సత్రంలోనో భోజనం చేసి, హాయిగా విశ్రమించేవాళ్ళం," అన్నాడు.

పక్కనే వుండి, ఈ మాటలు విన్న ద్వారపాలకుడికి వాళ్ళపై జాలికలిగి, "మీ వెంట వంట చేసుకునేందుకు అవసరం అయిన సామగ్రి వుంటే, కోట పక్కనే వున్న, నా చిన్న కుటీరంలో వంట చేసుకోవచ్చు," అన్నాడు.

తండ్రీకొడుకులు, ద్వారపాలకుడు చెప్పిన చిన్న కుటీరం ప్రవేశించి, ఒక గంట కాలంలో వంట పూర్తిచేసి, భోజనాలు ముగించారు. అయితే, అతి చిన్నదైన ఆ కుటీరంలో వాళ్ళిద్దరూ పడుకుని నిద్రపోయేందుకు చోటు చాలలేదు.

బోధిసత్వుడి తండ్రి, ద్వారపాలకుడికి కృతజ్ఞత చెప్పుకుని, "అయ్యా, ఈ రాత్రి విశ్రమించేందుకు తగిన చోటు ఏదైనా చూపగలరా?" అని అడిగాడు.

"నగరం వెలుపల ఒక పర్ణశాల వున్నది. కాని, అది భూతప్రేతాలకు ఆవాసం. అయినా, భయం లేకపోతుంటే, మీరక్కడ ఈ రాత్రికాలాన్ని హాయిగా గడపవచ్చు," అన్నాడు ద్వారపాలకుడు.

భూతప్రేతాల మాట వింటూనే బోధిసత్వుడి తండ్రి దిగాలుపడిపోయాడు. కాని, బోధిసత్వుడు ఆయనకు ధైర్యం చెబుతూ, "నాన్నా, మీరేం సంశయించకండి! పది సంవత్సరాల కాలం గురుకులంలో ఎంతో శ్రమపడి అభ్యసించిన నా విద్యల ప్రభావం మీరెరగరు!" అన్నాడు.

బోధిసత్వుడు ఇలా అనగానే, ఆయన తండ్రికి ఎంతో ధైర్యం కలిగింది. తండ్రీకొడుకులు ఇద్దరూ అప్పటికప్పుడే బయలుదేరి నగర పొలిమేరల్లో వున్న పర్ణశాలను చేరారు. ఆ సమయంలో అక్కడ ఎవరూ లేరు. ఇద్దరూ మెల్లగా



# ఏది గొప్పవిద్య?

**ఒక** గ్రామం నుంచి ముగ్గురు కుర్రవాళ్ళు ఒక గురువుగారి వద్ద చదువుకోవటానికి కలిసి వెళ్ళారు. గురువు మహా విద్వాంసుడు. ఎవరికే విద్య కావాలంటే ఆ విద్య చెప్పగల [illegible] విద్యార్థులలో ఒకడు వైద్యశాస్త్రం ప్రారంభించాడు. [illegible] మూడోవాడు తర్కం అభ్యసించాడు. గురువుగారు వాళ్ళను పరీక్షకు పెట్టి చూడవలిసి ఉంది.

ఒక రోజు ఒక పెద్దమనిషి గురువుగారి దగ్గిరికి ఒక జాతకం తెచ్చాడు. ఆ జాతకం గల యువకుడికి తన కుమార్తె నిచ్చి చేద్దామనుకుంటున్నానని చెప్పి, ''మిగిలిన అన్ని విషయాలూ మాకు చాలా తృప్తికరంగా ఉన్నాయి. ఆ అబ్బాయి జాతకం చూసి మీరు వివాహం చెయ్యమంటే చేసేస్తాను,'' అన్నాడు.

గురువుగారు ఆ జాతకాన్ని చూసి, ''ఈ కుర్రవాడికి వివాహ యోగంతో బాటు కొంచెం దుష్టగ్రహ వీక్షణ కూడా ఉన్నది. పెళ్ళి అయిన కొద్ది కాలానికి జబ్బు చేస్తుంది,'' అన్నాడు. ఈ మాట విని పెద్ద మనిషి దిగులు పడిపోయాడు.

[illegible] గురువుగారు [illegible] సంప్రతించుతున్నట్టుగా, వాళ్ళకేసి చూస్తూ ''మీరీ పెద్ద మనిషికి ఏమి సలహా ఇస్తారు?'' అన్నాడు.

వెంటనే తర్కం చదువుకున్నవాడు, ''ప్రతి జాతకంలోనూ ఎప్పుడో ఒకప్పుడు దుష్టగ్రహ వీక్షణ ఉండనే ఉంటుంది. ఇతర విషయాలన్నీ అనుకూలంగా ఉన్నప్పుడు తప్పక వివాహం జరిపించవలిసిందే,'' అన్నాడు.

వైద్యం నేర్చుకున్నవాడు, ''వరుడికి జబ్బేగదా చేస్తుంది? అసలు జబ్బు

ఆత్మజ్ఞానమూ అవసరమే. రేపే వారికి పరీక్ష పెడతాను," అంటూ గురువుగారు తాను తార్కిక శిష్యుడికి పెట్టబోయే పరీక్ష ఏమిటో చెప్పి, ఆమె చేయవలసినది కూడా వివరించారు.

మర్నాడు మధ్యాహ్నం వేళ అందరూ కలిసి భోజనాలు చేస్తున్న సమయంలో గురువుగారు, "పొరపాటున చిక్కుడు గింజంత విషపు పురుగును మింగేశాను త్రోయ్!" అని అరిచి, స్పృహ తప్పిపోయిన వాడిలాగా గోడకి చేరగిలబడి, కొయ్యబారి పోయారు.

"అయ్యో, అయ్యో! గురువుగారి సంగతి చూడండర్రా!" అన్నది గురువుగారి భార్య.

వైద్యుడూ, జ్యోతిష్కుడూ చప్పున భోజనం చెయ్యటం మానేసి లేచి చేతులు కడుక్కున్నారు. వైద్యుడు వచ్చి గురువుగారి నాడి పరీక్షించసాగాడు. జ్యోతిష్కుడు పంచాంగం తీశాడు. తార్కికుడు మాత్రం గురువుగారి కేసి ఒక్క క్షణం చూసి, తన మానాన తాను భోజనం చెయ్యసాగాడు.

గురువుగారి భార్య అతనితో, "నువ్వు ఏమున్న శిష్యుడివి? గురువుగారు విషపు పురుగును మింగి పడిపోతే ఏమీ జరగనట్టు భోజనం చేస్తున్నావే?" అన్నది.

"గురువుగారు ఏ విషపు పురుగునూ మింగలేదు. ఒక పురుగును మింగుతున్నామని, అది విషపు పురుగని, చిక్కుడు గింజంత ఉన్నదని కళ్ళారా చూసి కూడా మింగడానికి గురువుగారు వెర్రివారు కారు. ఒకవేళ పురుగు నోట్లోకి వెళ్ళాక తెలిసినా ముందు విసర్జిస్తారు గాని మింగియుండరు." అన్నాడు తార్కికుడు.

గురువుగారు కళ్ళు తెరిచి లేచి కూర్చుని తన భార్యతో, "చూశావుటే, తర్కం వల్ల ఉండే ఉపయోగం?" అన్నారు.

ఆ తరవాత ఆయన ముగ్గురు శిష్యులకూ చదువు పూర్తి అయిందని చెప్పి పంపేశారు.





# తాంత్రికుడి లోయ

చంద్రగిరి, మిత్రపురం ఇరుగుపొరుగు దేశాలు. చంద్రగిరి కన్న మిత్రపురం అన్నిటా బలమైనదేశం. చంద్రగిరి రాజు రుద్రసేనుడి భార్య, మిత్రపురం రాజు సోదరి. ఆ కారణంగా రుద్రసేనుడికి, మిత్రపురం రాజు నుంచి పూర్తి సహాయ సహకారాలు లభిస్తూండేవి.

రుద్రసేనుడికి ఒక కుమార్తె, కొడుకూ. కుమార్తె పేరు సువర్ణ. కొడుకు పేరు విజయుడు. సువర్ణకు పదహారేళ్ళ వయసు; విజయుడు పద్నాలుగేళ్ళవాడు. ఇద్దరూ అందచందాలతోపాటు, మంచి ధైర్యసాహసాలు కలవాళ్ళు.

చంద్రగిరికి దక్షిణపుటెల్ల సముద్రం. దానికీ చంద్రగిరి నగరానికీ మధ్య ఒక పర్వతశ్రేణి వున్నది. అందులో కొన్ని లోయలు. అలాంటి ఒక లోయలో, ఒకప్పుడు భైరవశర్మ అనే తాంత్రికుడు వుండేవాడు. అతడికి గొప్ప మంత్రశక్తి వున్నదనీ, మనుషులను వృక్షాలుగా, వృక్షాలను జంతువులుగా, జంతువులను పక్షులుగా మార్చగలడనీ ప్రజలు నమ్మేవాళ్ళు. అందువల్ల, ఆ లోయ కేసి ఎవరూ వెళ్ళేవాళ్ళు కారు.

భైరవశర్మ మరణం తరవాత, అతడి శిష్యుడు వికటశర్మ అనేవాడు, ఆ లోయలో నివాసం ఏర్పరచుకున్నాడు. తన గురువులా కాకుండా, వికటశర్మ తరచుగా లోయ ప్రాంతాల్లోని చుట్టు పక్కల గ్రామాలకు వెళుతూండేవాడు. అప్పుడప్పుడూ రాజ ప్రాసాదానిక్కూడా వస్తూండేవాడు. రాజు రుద్రసేనుడు అతడి పట్ల కొంత మర్యాద చూపేవాడు. ఇతరులకు హాని చేయగల మంత్రతంత్రశక్తి వున్నవాళ్ళతో, వైరం కూడదన్నది రుద్రసేనుడి అభిప్రాయం.

దేవప్రియ



ఇలా వుండగా, ఒకముఖ్యమైన పండగ దినం సమీపించింది. అలాంటి నాటికి యువరాజు విజయుడూ, యువరాణి సువర్ణా, తమ మేనమామ యింటికి వెళ్ళడం అలవాటు. ఇద్దరూ మిత్రపురానికి ప్రయాణం కట్టారు.

రాజు వృద్ధసేనుడు వాళ్ళకు రథంలో వెళ్ళవలసిందిగా చెప్పాడు. కాని, సువర్ణా, విజయుడూ తాము గుర్రాల మీద వెళతామని పట్టుపట్టారు. వాళ్ళకు కొంతదూరం అన్నా తెలిసినదే. పైగా వాళ్ళకు సాహసంతో కూడిన పనులంటే చాలా యిష్టం.

విజయుడూ, సువర్ణలకు అంగరక్షకులుగా నలుగురు ఆశ్వికులు బయలుదేరారు. అతే, నగర పరిసరాలు దాటేంత వరకూ మామూలుగా పరిగెత్తించిన తమ గుర్రాలను ఉత్సాహం కొద్దీ విజయుడూ, సువర్ణా చాలా వేగంగా దౌడుతీయించారు. ఆ కారణం వల్ల, అంగరక్షకులు బాగా వెనకబడిపోయారు.

విజయుడూ, సువర్ణా కొంత ప్రాంతాన్ని చేరి, గుర్రాలను ఆపి, తమ అంగరక్షకుల కోసం వెనుదిరిగి చూశారు. కాని, తమ చూపుమేరలో వాళ్ళెక్కడా కనిపించలేదు. ఇప్పుడు వాళ్ళున్న ప్రాంతం కొంత దాకా, మహావృక్షాలతో దట్టంగా వున్నది. మార్గం ఒకచోట మలుపు తిరిగింది. అక్కడ వాళ్ళకు ఎడమవైపున ఒకటి, కుడివైపున ఒకటి—రెండు మార్గాలు కనిపించినై. ఎడమవైపుది మిత్రపుర మార్గం, కుడివైపుది సన్నగా ఇరుకుగా వున్నది, మాంత్రిక వికటకర్మ వుండే లోయలోకి వెళ్ళేది.

విజయుడూ, సువర్ణలు తిరిగి గుర్రాలను అధిరోహించేంతలో, ఒక పెద్ద బండరాయి వెనక నుంచి, "కొంచెం ఆగండి!" అన్న మాటలు వినిపించినై.

వాళ్ళు ఆశ్చర్యపోతూ అటువైపు చూసేంతలో వికటకర్మ వాళ్ళ ముందుకు వచ్చి నిలబడ్డాడు. విజయుడూ, సువర్ణలకు కర్మ తెలుసు. అతడు అప్పుడప్పుడూ



ఇద్దరూ ఆ ఇంటి ముందుకుపోయారు. గుర్రాలను ఒక చెట్టు బోదెకు కట్టివేసి, మూసి వున్న తలుపు తట్టారు. జవాబు లేదు. కాని, తలుపు తెరుచుకున్నది. ఇద్దరూ లోపలికి వెళ్ళారు. మరుక్షణం తలుపు దబీమంటూ మూసుకున్నది. ఎదురుగా నవ్వుతూ మాంత్రికీ వికటకర్మ కనిపించారు.

విజయుడికీ, సువర్ణకూ కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. కాని, వాళ్ళు దాన్ని ఏ మాత్రం బయటకు కనబరచలేదు. సువర్ణ, మాంత్రికుడితో, ''మేం మంత్రపురానికిపోతూ, దారి తప్పాం.'' అన్నది నెమ్మదిగా.

ఆ మాటలకు మాంత్రికుడు నవ్వి, ''యువరాణీ, నువ్వేం దారి తప్పలేదు. చంద్రగిరి రాణి కాబోయే దారిలోనే నడుస్తున్నావు!'' అన్నాడు.

''మీరు పొరబడుతున్నారు. చంద్రగిరి సింహాసనానికి, నా తమ్ముడు వారసుడు. అతడి భార్య రాణి అవుతుంది.'' అన్నది సువర్ణ.

''పరిస్థితుల ప్రభావం వల్ల, మరొకరు చంద్రగిరి రాజు అయి, నిన్ను పెళ్ళాడి రాణిని చేయవచ్చు గదా!'' అన్నాడు వికటకర్మ.

''అందులో నా యిష్టమంటూ లేదా?'' అన్నది సువర్ణ కోపంగా.

''నీ యిష్టాయిష్టాలకు అవకాశమే లేదు,'' అంటూ మాంత్రికుడు ద్వారం కేసి బయలుదేరాడు.

''ఆగు! మేం లోపలికి రాగానే తలుపు మూసిందెవరు?'' అన్నాడు విజయుడు.

''ఆ వివరాలు అనవసరం. మీరిద్దరూ బయటికి పోలేరు,'' అంటూ మాంత్రికుడు గదిలోంచి బయటికి వెళ్ళి, తలుపు మూశాడు.

''మనిద్దరం, యీ దుష్టుల బందీలమన్నమాట!'' అన్నాడు విజయుడు. సువర్ణ గట్టిగా పళ్ళు కొరికి, గదికి మరొక పక్కగా వున్న తలుపు తెరిచింది. అక్కడ

మరుగుజ్జు పెద్ద కత్తితో అక్కడికి వచ్చాడు. వాడు ముందుగా యజమానికి నమస్కరించి, విజయుడు మంత్రజలంతో నింపిన నీటిపాత్ర నుంచి నీరు తీసుకుని ముఖం, చేతులూ కడుక్కున్నాడు.

తరవాత కత్తి పైకెత్తి ముందుకు వూకి ఒక్క వేటుతో తల నరికి, "ఆహా, ముందుగా మాటలరవై మేక తలలు నరికి అనుభవం గడించడం మేలే అయింది. దొరా, నన్ను చంద్రగిరి సేనానిగా చేయడం మరవకు!" అన్నాడు విజయుడికి నమస్కరిస్తూ.

ఎర్ర కమండలంలోని మంత్రజలం కళ్ళకు తగిలిన కారణంవల్ల, మరుగుజ్జుకు ఎడమవైపు కుడివైపుగా, కుడివైపు ఎడమ వైపుగా కనబడడంతో, వాడు అంతకు ముందే యజమాని అయిన తాంత్రిక వికటకర్మ తల నరికాడు.

తాంత్రికుడి చావుతో, విజయ, సువర్ణల మీద వాడు చల్లిన మంత్రించిన భస్మం ప్రభావం పోయింది. వెంటనే విజయుడు లేచి, మరుగుజ్జు తల మీద బలంగా కొట్టాడు. వాడు ఒక చావుకేక పెట్టి కింద పడి తన్నుకోసాగాడు.

విజయుడూ, సువర్ణా తాంత్రికుడి గృహం నుంచి పరుగు, పరుగున బయటికి వచ్చి, చెట్లకు కట్టివున్న తమ గుర్రాలను ఎక్కి, మిత్రపురంలోని తమ మేనమామ భవనానికి కాక, చంద్రగిరిలోని తమ ప్రాసాదానికి వాయువేగంతో వెళ్ళారు.

ఆ సమయంలో మిత్రపురం నుంచి తిరిగి వచ్చినవాళ్ళు అంగరక్షకులు, రాజా రుద్రసేనుడితో యువరాజూ, యువరాణీ అక్కడికి చేరలేదన్న వార్త చెబుతున్నారు.

తన కుమార్తె, కుమారుడూ క్షేమంగా వున్నారని చూస్తూనే రుద్రసేనుడు మహదానందం చెంది, వాళ్ళను కౌగిలించుకుని ఏం జరిగిందని అడిగాడు.

"ఒక మహాదుష్టుడైన తాంత్రికుడి పాలబడ్డాం. కథ అంతా తరవాత. దాహంగా వున్నది. ముందు మంచినీరు కావాలి," అన్నారు విజయుడూ, సువర్ణా.






వజ్రాంగుడికి బ్రహ్మ ప్రత్యక్షమై, "నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరం కావాలో కోరుకో," అన్నాడు.

"మహాత్మా, నా భార్య దేవతలను జయించగల కొడుకును కోరుతున్నది. ఆమెకు అలాటి కొడుకు కలిగేలాగు వరం ఇయ్యి," అన్నాడు వజ్రాంగుడు.

అతను కోరిన వరం ఇచ్చి బ్రహ్మ అంతర్థానమయాడు. వజ్రాంగుడు ఇంటికి తిరిగి వచ్చి, భార్యతో ఆమె కోరిక తీరుతుందని చెప్పాడు.

కొంత కాలానికి, అతని భార్య అయిన వరాంగి గర్భవతి అయి, పదవ మాసంలో ఒకనాటి తెల్లవారుఝామున ఒక కొడుకును కన్నది. త్రిలోక కంటకుడైన ఆ కొడుకు పుట్టగానే భూమి కంపించింది; అన్నివైపులా అగ్నిజ్వాలలు లేచాయి, సముద్రాలు పొంగాయి. పెనుగాలి వీచి చెట్లు విరిగిపడ్డాయి. అలాటి ఉత్పాతాలు ఎన్నో చూసి జనం బెదిరిపోయారు.

వజ్రాంగుడూ, వరాంగి తమ కొడుక్కు తారకుడు అని పేరు పెట్టుకుని, ఎంతో గారాబంగా పెంచసాగారు.

తారకుడు నానాటికీ బలం పెంచుకుని, పర్వతాకారం గలిగి, చూసేవాళ్ళకు భయంకరుడుగా తయారయాడు.

వరాంగి ఒకనాడు తారకుడితో, "నాయనా, నువ్వు బ్రహ్మను గురించి తపస్సుచేసి, మూడు లోకాలనూ జయించే లాగా వరాలు పొందు," అన్నది.



తారకుడు వెంటనే, ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి, అక్కడ మహా దారుణమైన తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు మూలంగా అతనిలో పుట్టిన వేడికి మూడు లోకాలూ దగ్ధమయేటట్టు కనబడింది. అప్పుడు దేవతలూ, మునులూ బ్రహ్మ వద్దకు వెళ్ళి, "మహానుభావా, నువ్వు వెళ్ళి ఆ తారకుడిచేత తపస్సు మాన్పించి, లోకాలను కాపాడు," అని భక్తితో వేడుకున్నారు.

బ్రహ్మ సరస్వతీ సమేతుడై హంస వాహనం మీద, తారకుడి వద్దకు వచ్చి, "తారకా, నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరాలు కావాలో కోరుకో," అన్నాడు.

తారకుడు పరమానందంతో బ్రహ్మకు నమస్కారం చేసి, "ఓ బ్రహ్మదేవుడా, నువ్వు వరాలిస్తా నన్నగానే నా తపస్సు ఫలించింది. నాకు మూడు లోకాలనూ జయించే శక్తి ఇవ్వు. శివుడి వీర్యాన పుట్టినవాడివల్ల తప్ప నాకు మరెవరి వల్లా చావు లేకుండా వరమివ్వు. నాకు ఈ రెండు వరాలే చాలు!" అన్నాడు.

బ్రహ్మ తారకుడికి అతను కోరిన వరాలిచ్చి సత్యలోకానికి వెళ్ళిపోయాడు. తారకుడు తన రాజధాని అయిన శోణిత పట్టణానికి తిరిగివచ్చి, తాను బ్రహ్మవల్ల పొందిన వరాలను గురించి తన తల్లికీ, తన గురువైన శుక్రాచార్యుడికీ చెప్పి, త్రిలోక దిగ్విజయానికి ముహూర్తం నిర్ణయించమని చెప్పాడు.

తారకుడు లోకాల మీద దాడి జరుపటానికి శుక్రాచార్యులు ముహూర్తం పెట్టాడు. తారకుడు ఆ ముహూర్తానికి చతురంగ బలాలతో స్వర్గం మీద యుద్ధానికి వెళ్ళి, దేవతలను జయించి, ఇంద్రుడి చేత కానుకలు పుచ్చుకుని, అతని సింహాసనాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

తరవాత తారకుడు వరుణుడి మీదికి యుద్ధానికి వెళ్ళి, జయించి, వరుణుడి రత్నాలను కానుకలుగా పుచ్చుకుని, తరవాత యముడిపైకి వెళ్ళాడు. క్రమంగా



కావలసిన పూలూ, పళ్ళూ, నీరూ తెచ్చి పెట్టి, ఇంటికి వెళ్ళి, తాను శివుడికి చేసిన సేవలు ప్రతిరోజూ తన తల్లిదండ్రులకు చెబుతూ ఉండేది.

శోణితపురానికి తిరిగి వచ్చిన తారకుడు కొంతకాలం ఉండి, స్వర్గానికి సైన్యంతో సహా వెళ్ళి, దేవేంద్రుడి సింహాసనం మీద కూర్చుని, దేవతల చేత పరిచర్యలు చేయించుకుంటూ, లోకాలను బాధించసాగాడు. అతను ఋషుల యజ్ఞాలకు విఘ్నాలు కలిగించాడు; తపస్సులను సాగనివ్వలేదు.

దేవేంద్రుడు మొదలైన వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, వరాలు పొందిన గర్వంతో తారకుడు తమను పెట్టే హింసలను గురించి మొరపెట్టుకున్నారు.

బ్రహ్మ తారకుడి వద్దకు వెళ్ళి, "తారకా, నువ్వు మూడు లోకాలనూ జయించావు గద. నీ శోణితపురం నుంచే మూడు లోకాలనూ పాలిస్తూ ఉండు. స్వర్గాన్ని దేవేంద్రుడికి ఉండనీ. నీకూ, దేవతలకూ మధ్య విరోధం దేనికి?" అని హితం చెప్పాడు.

తారకుడు బ్రహ్మ మాట పాటించి, స్వర్గాన్ని ఇంద్రుడికి ఇచ్చేసి, తాను శోణిత పురానికి వెళ్ళి, అక్కడి నుంచే మూడు లోకాలనూ పాలించసాగాడు. అతను ఈశ్వరారాధన చేస్తూ సుఖంగా ఉన్నాడు.

ఇంద్రుడు స్వర్గాన్ని తిరిగి పొంది కూడా, తాను మరొకడి అధికారం కింద పాలన చేయవలసి వచ్చినందుకు చాలా బాధపడి, తమ గురువైన బృహస్పతిని పిలిపించి, "గురుదేవా, త్రిలోకాధిపతి అయిన నేను తారకుడి కింద సేవకుడుగా ఉండటం చాలా అవమానకరంగా ఉన్నది. ఇలాంటి అవమానంతో బతికే కన్న చావు మేలు. దీనికి విరుగుడు తారకుడి చావే. నీకు తెలియని ఆలోచనలు ఉండవు. ఈ తారకుడు చచ్చే మార్గం ఏదన్నా ఉంటే ఆలోచించి చెప్పు." అన్నాడు.



''మనం బ్రహ్మనే ఆలోచన అడగటం మంచిది. తారకుడి విజృంభణకు కారకుడు ఆయనే,'' అన్నాడు బృహస్పతి.

అందరూ కలిసి బ్రహ్మ వద్దకు వెళ్ళి, తారకుడు చచ్చే ఉపాయం చెప్పమని ఆయనను అడిగారు.

''శివుడి వీర్యాన పుట్టినవాడి చేతిలో తప్ప తారకుడికి చావు లేదు. నేను వాడికి అలా వరం ఇచ్చాను. సతీదేవి మరణించాక విరాగి అయి శివుడు కైలాసపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సతీదేవి హిమవంతుడికి కుమార్తె అయి పుట్టి, శివుడికి పరిచర్యలు చేస్తున్నది. ఆమె తన మనసులో శివుణ్ణే తన భర్తగా కోరుకుంటున్నది. మీరు ఎలాగైనా శివుడికి పార్వతి మీద మోహం కలిగేటట్టు చేసి, వారికి వివాహం జరిపించ గలిగితే, శివ పార్వతులకు పుట్టే కొడుకు తారకుణ్ణి చంపుతాడు,'' అని చెప్పి బ్రహ్మ దేవతలను పంపేశాడు.

శివ పార్వతులకు పుట్టబోయే కొడుకు తారకుణ్ణి చంపుతాడని బ్రహ్మ చెప్పినందుకు సంతోషించి, దేవతలు స్వర్గానికి తిరిగివచ్చి మన్మథుడికి కబురు పంపారు. మన్మథుడు వచ్చాడు. ఇంద్రుడు అతన్ని సింహాసనం మీద కూర్చోబెట్టి, ''మన్మథా, తారకుడు బ్రహ్మవల్ల వరాలు పొంది, మూడు లోకాలూ జయించి, దేవతలనూ, ఋషులనూ బాధిస్తూ, తపస్సులూ, యాగాలూ జరగనివ్వకుండా ఉన్నాడు. నేను మూడు లోకాలూ ఏలుతూంటే, తారకుడు నన్ను ఏలుతున్నాడు. శివుడి వీర్యాన పుట్టినవాడివల్ల తప్ప అతనికి మరణం లేదు. శివుడేమో కైలాసంలో తపస్సు చేసుకుంటున్నాడు. పార్వతి అతనికి సపర్యలు చేస్తున్నది. పార్వతి శివుడి సమీపంలో ఉండగా నువ్వు ఎలాగైనా సరే శివుడికి మోహం కలిగేలాగు చెయ్యాలి,'' అన్నాడు.

ఇంద్రుడి కోరిక విని మన్మథుడు భయపడి, ''శివుడికి పార్వతియందు



మోహం కలిగేటట్టు చెయ్యటం నా తరమా? శివుడు గొప్ప తపశ్శాలి. కోపిష్టి వాడు. మూడోకన్ను తెరిచాడంటే మూడు లోకాలూ భస్మమవుతాయి," అన్నాడు.

మన్మథుడు ఇలా అనేసరికి ఇంద్రుడు మొదలైనవాళ్ళు అతనికి ధైర్యం చెబుతూ, "అదేం మాట? మూడు లోకాలలోనూ నీకు లొంగని వారెవరున్నారు? నీ మూలాన స్త్రీ పురుషులు మోహంలో పడటంవల్లనే గదా సృష్టి జరుగుతున్నది? నీ పుష్పబాణాల తాకిడికి ఎలాంటి తపస్సూ నిలవదు. పైగా ఇది దేవకార్యం. లోకహితం నీ ద్వారా జరగవలసి ఉన్నది. నీకు సహాయంగా మలయమారుతాన్ని, వసంతుణ్ణి, శుక, పికాలనూ తీసుకుపో. మేము కూడా నీకు సహాయం చేస్తాం. శివుణ్ణి నీ బాణాలతో కొట్టి వశపరుచుకో," అన్నారు.

మన్మథుడు ఈ మాటలతో పొంగిపోయాడు. శివుణ్ణి జయించి, ఆయనకు పార్వతి పైన మోహం కలిగేటట్టు చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు. అతను తన ఐదు పుష్పబాణాలను తీసుకుని, వసంతుణ్ణి వెంటబెట్టుకుని, చిలుక వాహనం మీద శివుడు తపస్సు చేసుకుంటున్న మారేడు వనానికి వెళ్ళి, రహస్య ప్రదేశంలో దాగి, పార్వతి రాక కోసం ఎదురు చూడసాగాడు.

మన్మథుడు ప్రవేశించగానే మారేడు వనం వసంత శోభతో నిండిపోయింది. చెట్లు చిగిర్చాయి. పూలు పూశాయి. చిలుకలూ, గోరువంకలూ, కోకిలలూ పాడాయి. కొద్దిసేపట్లో పార్వతి తన చెలికత్తెలతో సహా మారేడువనం ప్రవేశించింది. వాళ్ళు తమ వెంట పుష్పాలూ, ఫలాలూ, సుగంధ ద్రవ్యాలూ తెచ్చారు. వనం పూర్తిగా మారి ఉండటం చూసి ఆశ్చర్యపడుతూ పార్వతి శివుడున్న చోటికి వెళ్ళింది.

పార్వతిని శివుడు కన్నెత్తి చూశాడు. పార్వతి కొత్తగా కనబడింది. వనమంతా వింతగా కనబడింది. కాని శివుడు ఆ

మార్పుకు కారణమేమిటని ఆలోచించక, మళ్ళీ కళ్ళు మూసుకుని తపస్సులో మునిగిపోయాడు.

పార్వతి రోజూలాగే శివుడికి పాదసేవ దారాలా చేసి, వందనం చేసి, ధ్యానిస్తూ శివుడి ఎదుట నిలబడింది. అప్పుడు శివుడు ఆమెను మళ్ళీ చూసి, ఎప్పుడూ లేని మోహావేశం చెంది, అలాగే ఆమె కేసి చూస్తూ ఉండిపోయాడు.

పార్వతి శివుడి వద్ద సెలవు పుచ్చుకుని వెనక్కు తిరిగి వెళ్ళిపోసాగింది. శివుడు మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఆ సమయంలో మన్మథుడు తన పుష్పబాణాలను ఒకటొకటిగా శివుడి హృదయానికి గురి చూసి కొట్టాడు. అరవిందమూ, అశోకమూ, చూతమూ, నవమల్లికా శివుణ్ణి కదిలించలేక పోయాయి. కాని మన్మథుడి అయిదో బాణమైన నీలోత్పలం శివుడి హృదయాన్ని గాయపరిచింది. దాని దెబ్బకు తాళలేక శివుడు ఆగ్రహావేశంతో, "ఎవడురా, నన్ను పుష్పబాణాలతో కొట్టినవాడు?" అంటూ లేచి నిలబడి, మూడో కన్ను తెరిచాడు.

శివుడు మూడో కన్ను తెరవగానే అందులో నుంచి అగ్నిజ్వాలలు బయలుదేరి వనమంతా ఒక్క క్షణంలో బూడిద అయిపోయింది. దానితోబాటు మన్మథుడు కూడా బూడిద అయిపోయాడు.

దేవేంద్రుడు మొదలైన దేవతలు శివుడి ఎదటికి వచ్చి స్తోత్రపాఠాలు చదివి ప్రసన్నుణ్ణి చేసుకున్నారు. ఆయన తన మూడో కన్ను మూసి, అగ్నిజ్వాలలను ఉపసంహరించాడు. అప్పుడు, మన్మథుడి భార్య అయిన రతీదేవి శివుడి ఎదటికి వచ్చి, "సదాశివా, నా భర్తవల్ల ఏ తప్పూ లేదు. నీవల్ల పార్వతికి కుమారుడు కలిగితే అతను తారకుణ్ణి చంపగలడన్న ఆశతో దేవేంద్రుడు మొదలైనవాళ్ళు, నీకు పార్వతి మీద మోహం కలిగించమని నా భర్తను కోరారు. మా తప్పులు మన్నించి నాకు పతిభిక్ష పెట్టు. పార్వతిని వివాహమాడి, లోకాలను కాపాడు," అన్నది.





ఆ జవాబుకు ఇస్మాయిల్ పళ్ళు పట పట కొరుకుతూ, ముసలివాణ్ణి కొట్టసాగాడు. ముసలివాడు రక్షించవలసిందంటూ పెద్దగా అరవసాగాడు.

ఆ అరుపులు విని బజారున పోతున్న వాళ్ళు అక్కడికి వచ్చారు.

"ఈ మోసగాడు రెండు రోజులుగా నాకు దొంగ నాణాలిచ్చి గొర్రె మాంసం తీసుకుపోతున్నాడు!" అని వాళ్ళకు ఇస్మాయిల్ చెప్పాడు.

"అయ్యలారా, వినండి! ఇతడిచ్చే నాసి రకం మాంసానికి, వెండికాసు లిచ్చేంత వెర్రివాణ్ణి కాదు, నేను. గొర్రె మాంసం పేరుతో, ఇతను కుక్క మాంసం అమ్ముతున్నాడని తెలుసుకున్నాను. ఈ సంగతి నలుగురిలో బయట పెడతానన్న భయంతో, నన్ను మోసగాడు అంటూ పేరు పెడుతున్నాడు," అన్నాడు ముసలివాడు.

అక్కడ చేరిన జనంలో ఒకడు ముసలివాణ్ణి, "ఆ సంగతి నువ్వు రుజువు చెయ్యగలవా?" అని అడిగాడు.

"రుజువు చెయ్యగలను నేను. నా నమ్మకం!" అంటూ ముసలివాడు వాళ్ళను, దుకాణం వెనక వున్న ఆవరణలోకి తీసుకుపోయాడు. అక్కడ ఎదురైన దృశ్యం చూసి అందరూ పరమాశ్చర్యం చెందారు.

ముసలివాడు నిన్నటి లాగే చిన్నగా నవ్వి, వాడికి రెండు వెండి కాసులిచ్చి, మాంసం తీసుకుని వెళ్ళిపోయాడు.

కాని, ఆ రాత్రి ముసలివాడిచ్చిపోయిన మూడు వెండికాసులూ, మూడు కొయ్య ముక్కలుగా మారిపోయినై.

ఆ మర్నాడు ముసలివాడు రాగానే, ఇస్మాయిల్ వాడి మెడ గట్టిగా పట్టుకుని, "ఒరే, ముసలిపీనుగా, నీకెంత ధైర్యం! నన్నే మోసం చేస్తావా?" అన్నాడు కోపంతో నిలువెల్లా ఊగిపోతూ.

ముసలివాడా మాటలకు ఏమీ తొణకక, "మోసం చేసింది నేను కాదు; నువ్వు!" అన్నాడు చిరునవ్వునవ్వుతూ.



ఇస్మాయిల్ అవసరంలో కల్పించిన గొర్రెలన్నీ ఒక్కక్షణంలో కుక్కలుగా మారిపోయినై!

అది చూస్తూనే ఇస్మాయిల్‌కు మతి పోయినంతపనయింది. వాడు కొద్దిసేపటికి తేరుకుని, ముసలివాడు ఏదో మంత్ర తంత్రాలు నేర్పిన ముష్టివాడని జనానికి చెప్పబోయేంతలో, వాళ్ళు, వాణ్ణి నాలుగు తన్ని, పెడరెక్కలు విరిచికట్టి, పట్టణ పాలకుడైన అమీర్ దగ్గిరకు తీసుకు పోయారు.

అమీర్ జరిగినదంతా విని పట్టరాని కోపంతో, "ఒరే, ఏయుదా! నా వంటవాడు కూడా ఎంతోకాలంగా, నీ దుకాణంలోనే మాంసం కొంటున్నాడని, నాకు తెలుసు. నిన్ను నిలువునా చిత్రవధ చేయిస్తాను," అంటూ ముందున్న పెద్ద పుస్తకం పేజీలు కొంచెం సేపు తిప్పి చూసి, నిస్పృహగా, "నువ్వు కొంతలో కొంత అదృష్టవంతుడివి. నీ నేరానికి మరణ శిక్ష వేయాలనుకున్నాను. కాని, శిక్ష స్మృతి ఒప్పదు," అని భటులను పిలిచి, "ఈ దుష్టుణ్ణి ముందు నూటఒక్క కొరడా దెబ్బలు కొట్టండి. తరవాత, కుడి కన్ను పొడిచివేయండి. అది జరిగాక, వీణ్ణి తీసుకుపోయి, మన దేశ సరిహద్దుల అవతల పారవేసిరండి!" అని చెప్పి, ఇస్మాయిల్‌తో, "ఒరే, నీ ఇల్లూ, దుకాణం, కూడబెట్టినధనం—అంతా సుల్తానుగారి పరం అయిపోయింది," అన్నాడు.

భటులు, అమీర్ ఆజ్ఞప్రకారం ఇస్మాయిల్‌ను కొరడాలతో కొట్టి, కుడికన్ను గుడ్డిచేసి, వాణ్ణి తీసుకుపోయి, సరిహద్దుల అవతల వదిలారు.

అహంకారం, మితిమీరిన ధనాశ తనకు యింతటి దురవస్థకు కారణాలయినవని ఇస్మాయిల్ దుఃఖిస్తూ, కొన్నాళ్ళకు మరొక నగరం చేరాడు. అక్కడ వాడు బిచ్చమెత్తి కాలం గడపసాగాడు. ఒకనాడు తోటి బిచ్చగాళ్ళు మాటల సందర్భంలో వాడితో, "ఒరే, ఈ నగర సుల్తానుకు

కుపాల పెట్టి వున్నది. ఒంటి కంటివాడు ఎదటపడితే దుశ్శకునంగా భావించి కొరడా దెబ్బలు శిక్ష వేస్తాడు. ఆ కళ్ళల్లో కుడికన్ను గుడ్డిదయితే మాత్రం ఉరిశిక్షే! కనక, ఆయన కంటపడకుండా జాగ్రత్త పడుతూ వుండు,'' అని సలహా ఇచ్చాడు.

అయితే, ఒకనాడు ఇస్మాయిల్ భిక్షం కోసం రాజవీధిలో తిరుగుతూండగా పెద్ద కోలాహలం బయలుదేరింది. కొందరు గుర్రపురౌతులు జనాన్ని తప్పుకోమని హెచ్చరిస్తూ దారి తీయసాగారు. విచారించగా ఇస్మాయిల్‌కు ఆ దారి వెంట సుల్తాను వస్తున్నట్టు తెలిసింది. వాడు, బిచ్చగాళ్ళ సలహా గుర్తు తెచ్చుకుని పరుగున వెళ్ళి, ద్వారం బార్లా తెరిచి వున్న ఒక ఇంట్లో ప్రవేశించాడు.

ఆ వెంటనే కండలు తిరిగిన ముగ్గురు వస్తాదుల్లాంటి వాళ్ళు వాడి మీద పడి, ''ఒరే, దొంగవెధవా, దొరికావా! గత మూడు రోజులుగా, మేం లేనప్పుడు వంట గదిలో దూరబడి, అక్కడ దొరికినదంతా తినిపోతున్నది నువ్వేగదా!'' అంటూ చితకబాది వీధిలోకి విసిరివేశారు.

కొంతసేపు తరవాత ఇస్మాయిల్‌కు స్పృహ వచ్చింది. వాడు ఇక ఆ దేశంలో వుండడం క్షేమం కాదనుకుని బయలుదేరి మరొక దేశం చేరాడు. ఈ లోపల ఇస్మాయిల్ తమ్ముడు తన అన్నకు పట్టిన దుర్గతి తెలుసుకుని, వెతుక్కుంటూ వచ్చి తన ఇంటికి తీసుకుపోయాడు.

వాడు తమ్ముడికి తను పడ్డ కష్టాలన్నీ వివరించి, ''ఒరే, తమ్ముడూ! నా దురాశ నన్నెన్ని కష్టాల పాలు చేసింది. నువ్వూ నాలాగే మొండిగా అమ్మ జీవనం గడిపే కటికవాడివి. నాలాగే బాగా సంపాయించి కూడా వుంటావు. ఒక్క సంగతి గుర్తుంచుకో—ఏనాడూ మనసులో గర్వం, అహంకారం లాంటి దుర్లక్షణాలకు చోటివ్వకు. పరాయిదేశాల నుంచి ఇక్కడికి వచ్చే వాళ్ళు, మనకు అతిథుల లాంటి వాళ్ళు. అలాంటి వాళ్ళను మోసగించే ప్రయత్నం చెయ్యకు,'' అని సలహా ఇచ్చాడు.



NEW!

# MAGGI®

# 2-Minute Noodles




## The tastiest snack !

Made from high quality wheat flour and vegetable fat, Maggi 2-Minute Noodles are hygienically steamed and fried in an automatic plant.
Each Tastemaker is a special blend of select spices and seasonings. What's more 3 exciting flavours to delight every taste. **Masala and Capsika for Vegetarians. Chicken for Non-Vegetarians.**
Simply add Maggi 2-Minute Noodles, along with your favourite Tastemaker, to boiling water. Simmer for 2 minutes. And serve a delicious wholesome hot snack!

# Fast to cook ! Good to eat !

